


ఉ॥ శ్రీవర! భక్తలోక పరిశీలన! శ్రీదా! పరాత్పరా!

కేవలమూఢినయ్యు మదికింపగు నిచ్చ భజింప నీనకా

దే! విధివిష్ణుశర్వులను దివ్యసమాఖ్యల నంది విశ్వజ

న్మావన సంహృత్యుత్క్రియలు నాగసు చేయుదు జానకీప్రియా.

చ॥ దయఁగనుచుంచు భక్తినెదఁదప్పక నీపయిఁజెప్పినట్టి ప

ద్దియములు చెప్పుచున్నడివి తేకువ నమ్మెడు పంతులుగానె! నా

కయితే కుఁ బండితాగ్రణులు గౌరవమూయరటంచుఁ గల్గసం

దియమిపు డిప్రు నాకృతిని నిల్పిన మేలగు జానకీప్రియా.

ఉ॥ బాల్యమునందె శ్రీచ్ఛరణ పంకజభక్తియె లబ్బెఁ జిత్తచా

పల్యము మీఱ నీపయిని బద్దెము లల్లితిఁ గొన్ని యందు నా

బాల్యమెగాని, చాతురియుఁ బాటవముంగన రాదు, నా మనో

శైల్యమెఱింగి మూల్యముగఁ జేకొను వానిని జానకీప్రియా.

చ॥ నినుభజియించువారల ననేకులని వవనంబు సేయుటల్

వినుటనునిన్నె నమ్మి కను వేడ్క మెయిం భజియించెదన్ శ్రీతా

వసుఁడను కీర్తిధారిణిని వారితరీతి వెలుంగఁజేయ సా
ధనమతిదీనమత్సదృశదాసుల నేలుటె జా॥

చ॥ సరసిజసంభవాది దివిషత్సభయెల్లను వచ్చిపూర్వ ని
ర్జరులొనరించు బాములను సైఁపఁగఁ జాలమటంచు నేఁడ
త్సురరిపులన్వధింప బుధతోషము నింపఁదలంచి గాదెబల్
కరుణవహించి శ్రీరఘుకులంబునఁ బుట్టుట జా॥

ఉ॥ బూటకమైన యీభవసముద్రమునంబడి మున్గిదీని, నే
దాఁటఁగ సాధనంబయిన తావకపాదయుగంబు నైమసేన్
నాటఁగ జేయఁజాలక యనారతమున్వెతఁ జెందుచుంటినో
హాటకచేల! నన్నెటుల నారసి ప్రోచెదో జా॥

చ॥ కనఁగ ననేకజన్మకృతకర్మము లేపెనుద్రాఁకుగాఁగ ని
త్యనయకళత్ర మిత్రులనుదా*రువుయంత్రము త్రోడిసంగతిన్
గొనితనునామమృద్ఘటము గూర్చి సంసృతికూపమందిటుల్
మునుఁగుచు దేలుచుండిన మముంగని తేల్చుముజా॥

ఉ॥ జేనెడుపొట్టపోసికొనఁ జేయఁగరాని యకృత్యజాలముం
దా నొనరించి మానవుఁడు తప్పకగల్గిన తత్ఫలంబులన్
బూనఁగలేక నిన్నపుడు ప్రోవుము దేవ! యటంచు వేఁడుటల్
గానఁగ నిర్గతాంబు తటకల్పనమౌఁ గద జా॥

చ॥ చొరఁగ నశక్యమైయుబవిసొంపునదోఁచెడునీభవంబు దు
స్తరమగు కర్మపుంజమొక తామరతంపరనాఁగఁ జుట్టెడిన్
దరఁగలఁబోలె జన్మములఁదద్దయునిచ్చుచు మాతృగర్భపు
న్నరకమునందు ముంపనగునా? సుగుణాకర! జా॥

* దారువుయంత్రము = ఏతాము.

ఉ॥ నూరువచింప నేటికి? ననుంగృపఁ బ్రోచుట నీవ, యంటి నే
నారయ నా†జవంజవ మహాహ్రదముంగని భీతినొందియున్
గోరక యే, "గతానుగతికో జన" యన్నటు చేరి కామము
ఖ్యారిపయశ్చరంబులను నగ్గమవైతిని జా॥

చ॥ కువలయనాథుఁ గోరెడి చకోరములట్టులు మించు తొల్కరిన్
నవజలదాళిఁ గాంచ నయనంబులు విప్పెడు సైరికాళి పో
ల్కి వనజసుందరాస్య ఘనకృష్ణశరీరము నీసురూపమున్
దవిలి గనన్మదాత్మకముఁ దత్తరమందెడు జా॥

ఉ॥ కొందఱు కుఱ్ఱలొక్క మొగిఁ గూడి కడుంగడు కూర్మి నైరజో
బృందము బొమ్మరిండ్లని, మఱే మొయటంచు ఘటించి పిమ్మటన్
జిందుగఁ జేసి పోవునటు చిన్మయరూపుఁడ వయ్యు లోకముల్
పొందుగఁ గూర్చుచుందు దశఁ బొల్లుగఁ జేయుదు జా॥

ఉ॥ ఏటను బోవుచున్న జనుమెంతయుఁ గూడుచు వీమ్రాఁ‡కులే
బోటియుఁ బుత్రులంచు హితబుద్ధిఁ దలంపక వీరికై నిరా
ఘాటసుఖోత్కరమ్ము నొసఁగందగు నిన్ భజియింపలేర హా
కాటికిఁ బోవు కట్టెలకుఁ గష్టమదేటికో? జా॥

ఉ॥ కల్పనలెన్నియేనిఁ జటికస్వనకుంబచరించుచుండి, య
త్యల్పసుఖప్రదంబగు భవాఖ్యమహాటవి సంచరించుచున్
వేల్పులకెల్ల వేల్పవయి వెల్గెడు నీమహిమంబు నాగరా
ట్తల్ప! ఎఱుంగఁజాలముగదా! ఎటుప్రోచెదో? జా॥

ఉ॥ నాపయిఁ గోపమా? కృపమనంబున నిల్పవు నాదు పాపమా?
ఓపురుషోత్తమా! శ్రితులనోమక యుండుట యే ప్రతాపమా?

---

† ఆజవంజవ=సంసారము; ‡ మ్రాఁకులు=చెట్లు.

ఓపికతోడఁ బ్రోవుమనియున్న ననున్ గనసంటవొ యొక్కయా
లావమ? చాలుఁజాలు నిటులన్, దయఁజూపుము జా॥

ఉ॥ వెంటనె వేఁడుచుంటి నిటు వెఱ్ఱితనంబున నేర్పులేక ని
న్నంటెనటంచుఁ గిన్కవడ దాత్మజతుంఱ్యుఁడ, నీకొకప్డు బన్
తుంటరి పుత్త్రుఁడైనఁ గడఁద్రోయుదె? ప్రోచెదుగాని తండ్రి నీ
వంటిని గాదె! ప్రోవుము దయాశరధీ నను జా॥

ఉ॥ ఎంతటిపాపునైనఁ దరియింపఁగఁ జేయును నీచరిత్రము
త్యంతమునీ పదాంబుజములానిన వారును బాపులంచు సం
భ్రాంతత నొంది పల్కకుము పాపినిదక్క, శ్రితౌఘదుస్తమో
ధ్వాంతవిభాకరా! ఘనకృపాకర! రాఘవ! జా॥

ఉ॥ దంభపథమ్ముఁ ద్రొక్కియహితమ్ము హితమ్ము నెఱుంగలేక కు
జ్జృంభరులౌచు సజ్జనులిసీయని ప్రువ్వఁజరింపఁ జొచ్చి పా
పాంభమునన్మునింగిదరి సాదఁగఁజాలరు కొందఱట్టిగ్లా
నింభరియింపఁజాలఁ గరుణింపుము రాఘవ! జా॥

ఉ॥ స¶త్తువచింతుఁగాని, యొకసక్కము కైయుటుగాదు, తానదో
విత్తనముంచి తత్ఫలము వేఱుగఁ గోరిన నెట్లు గల్గెడిన్
బత్తిని నుంభజింపక శుభంబులఁగోరిన వచ్చునెట్లు ని
చిత్తమునాదు భాగ్యమిఁకఁ జెప్పఁగనేటికి? జా॥

ఉ॥ కాలుఁడెడంచునంచెద చకాచకలైతలడిల్లె మాకు, నిన్
జాలినభక్తిమైఁగొలువఁజాలనిచింత యొకంతగల్గెడిన్
బాలిశులంచు మమ్మరసి పాలనుముంచెదొ? నీటముంతొ వే
యేలవచింప? నీశ్రితులనేలుటె యొక్కవ జా॥

---

§ ప్రువ్వన్=నిందింపంగా; ¶ సత్తు=సత్యము.

ఉ॥ అచ్చముగా వచింతు శ్రితుఁడ నన్మతి నేలుము, సజ్జనాళికిన్
మెచ్చుగఁ బున్నెముం జలుప నేరక యుంటి నటందు వేని, నీ
యిచ్చకు వచ్చినట్టుల ఘటింపుమిఁకేటికి? దేవ! చల్లకున్
వచ్చియు ముంత దాఁపఁదగవా? శ్రితరక్షక! జా॥

ఉ॥ నేరక యెల్లవారు భవనీరధిఁ జేరుట, యందు మున్గుటే
నారసి, వారిలో ననొకఁడైన నహా! పరతీరమందలే
డాగ! యటంచు భీతిలియు నజ్ఞత నన్గొనిలాగ, ముక్తియున్
క్షీరధియందెగా యనుచుఁ జేరితిఁ బ్రోవుము జా॥

ఉ॥ ఇంచుకయైన సద్గతి లభింపఁగ మార్గముఁ గాంచలేను, నీ
యంచితభక్తి నాహృదయమందు రవైగ నరాదు, నిన్నుఁ బ్రా
ర్థించు లసచ్చరిత్రలు శ్రుతిద్వయికింగడు చేదు, మైమయిన్
సంచితమెల్లఁ బోదెటుల సత్ప్రవఁజూచెదో? జా॥

ఉ॥ ఇట్టులఁ బల్కితంచు మదినేమి తలంతువొ? గాని ప్రేమఁ జే
పట్టితివా విభీషణునిఁ బావని నేలితివంట, వారలన్
బట్టుక ప్రోచుటెల్ల మెడఁబట్టని మేనరికంబొ? నీకు నేఁ
జట్టముగానె? నన్గరుణఁ జూడవదేటికి? జా॥

చ॥ ఘనతరహర్షహేతువయి, కంజభవాద్యమరాగ్ర్య నార్యమై
సునిగమబోధితంబయి, సుశోభితమాఘనదంఘ్రియుగ్మమున్
గొనిభజియింపఁ జాలకొకకొంచెము విత్తముకై ప్రయత్నమున్
ఘనముగఁ జేయు దుర్మతి పా‡కార్ప్యము రాఘవ! జా॥

ఉ॥ అద్దిర! ఎల్లవేళల దురాశ కడుంగడు ద్రిప్పుచుండ మేల్
బుద్ధి వహింపలేక చెడుపోకలఁ బోయినవాని నెంతయున్

---

‡ పాకార్ప్యము = పోఁగొట్టుము.

మున్గెదునే? పరేతపతి, ముంజెయిఁ గాంచఁగ నద్దమేల? యు
ష్మద్దయపేక్ష తద్దురిత సంఘమడంగునె? జా॥

చ॥ నిటలతలాక్షుఁడైన నెవనిన్మది నిల్పి తదీయమంత్రలం
పటుఁడగునట్టినిన్ బతితపావనుఁ గొల్వక యాత్రయంత్రముచె
న్నటులను, "కానికూడుదిని నంగను వైనను నిందకొండె" న
న్నటులెగదా! నరాధముల నాశభజించుట జా॥

ఉ॥ నీదగునామమంత్రమును నిష్ఠజపించినవారి, నీదుప
త్త్వాదసరోజయుగ్మము సదా మదినిల్పినవారి నీచరి
త్రాదులభక్తితోఁ జదువ నహర్నిశము న్వినువారి నెంతయే
నాదరబుద్ధిఁ జూచెదవటయా శ్రితవత్సల! జా॥

ఉ॥ యుక్తముగా వచింతు నొకయుక్తియె "నీదగు పాదపంకజా
సక్తియె ముక్తిఁ గూర్చఁదగు సాధనమౌనని చెప్పుటల్ స్వభా
వోక్తియెగాని సుంతతిశయోక్తిఁగాదని చెప్పవచ్చు సు
వ్యక్తముగాఁగ సర్వముఖహస్తులునై"యని జా॥

ఉ॥ ఈయక రాదటంచు బుధులెల్ల వచింప నెఱింగియుండి, వి
త్తాయతిగల్గియుం బి§కిరమైనను బెట్టఁడు బీదకైనఁ దాఁ
బోయెడువేళఁ బట్టుకొనిపోవునొ? యింతియు నీయవాఙ్మయా
మాయనుగాదె! దానినిఁక మాయఁగఁ జేయుము జా॥

ఉ॥ హా! యిటువంటి వెఱ్ఱిగలదా? తమకన్నులఁ గాంచుచుండఁగాఁ
గాయములెన్నియేనిఁ ద్రుటికాలములోన నశించుచుండ, నా
సాయము, దినికై బడలి సత్యముదూలి చరింతురిట్టికా!
పేయము వేగమాన్పి కనిపెట్టుము రాఘవ! జా॥

§ బికిరము = భిక్ష.

చ॥ అహాహా! పురాత్తకర్మఫలమందఁగ సంసృతిభారముం ‡వహం
విహాములరీతి మోయుచుఁ జలించుచు ద్రోవనొకింత తప్పనా
ధ†హారి విధాన, నాథ! హరి! తద్దయు మంచి తెఱంగు చూపి, సద్
దహాతహానొందనీకుము శ్రీప్రమదావహా! జా॥

ఉ॥ నిద్దురలేచుటే మొదలు నిజబాంధవుఁడేఁగు నంతకున్
బద్దుకురాశి కార్యముల వారముగా నొనరించుచుంటమే
ప్రొద్దునొకప్డు భక్తజనపోషక నిన్ను స్మరింపఁ జాలమ
స్మద్దురితంబు పోవుటకు మార్గమదెట్టిదొ? జా॥

ఉ॥ విద్దెలకుం బ్రయోజనము విత్తము తెచ్చుట యంచు నీచులం
బద్దెములందుఁ గల్పనాక ప్రౌఢిమయందుముగాని నీదుభా
స్వద్దయఁ గాంచి ముక్తికి సాధనమైతగు నీదునామముం
దిద్దమునాల్క నెట్లుమము దీనులఁ గాచెదొ? జా॥

ఉ॥ కానుపురీతి మమ్ములను కారణసత్కృప నేలుచుందువే
గాని, దయాబ్ధి! నీకునుపకారమదేమి యొనర్చువారమ
య్యా! నిను నమ్మియుంటిమని యాదృతి దెల్పుటె కాని చిత్తసం
ధానము చేసినుం దలఁప భాగ్యము చాలునె? జా॥

ఉ॥ అట్టిభవంబునందుఁ దగులాటము నొంది కు*షిండకీటకం
బెట్టులు పట్టులోనఁబడి యెంతయు వందురునో, యటుల్ బుధుల్
వెట్టిసత్రోవలోఁ బడక పే¶రడవిం జరియించుచున్నమా
యట్టివివేకహీనుల దయామతి నేలుము జా॥

చ॥ ఇలఁగల జంతుజాలముల నెల్ల రజోగుణరూపివై సృజిం

---

‡ వహంవిహాము=బండియెద్దు; † నాథహారి=ముక్కుత్రాడులాగువాడు;

* కుషిండకీటకంబు=సాలెపురుగు; ¶ పేరడవి=దట్టమగునడవి.

చి, లలితసత్యముగాఁ దివముఁ జేకొని ప్రోచుచుఁ దామసాకృతిన్
బొలియఁగఁజేయుమూర్తులను మూఁడిటిఁ గానిన వానిఁగాఁగని
నెలియక మానవుండని గణింతురు మూర్ఖులు జా॥

ఉ॥ ఏఘనునావయిన్మిగిలి యింద్రియపంచక మెంతయున్ మహో
టోపముఁ జూపఁ జిత్తము పటుత్వము దప్పుచుఁ దత్తదింద్రియ
వ్యాపృతిసక్తినొందఁగ నివారణసేయఁగ శక్యమౌనె? నీ
వే పరమాత్మ! మంచితెఱఁగించుక చూపుము జా॥

ఉ॥ తామునుచేయు కర్మసముదాయమునంటియె ప్రాప్తమౌఫల
స్తోమము మైనహంక్రియలఁ జూపుట లెంతటి వెఱ్ఱియో? భవ
న్నామజపంబుచేఁబడయు జ్ఞానములేమినిగాదె యిట్టులో
స్వామి! త్వదీయనామ జపసక్తత కూర్పుము జ॥

చ॥ తనువొకశాశ్వతమ్మనుచుఁ దల్పఁగ లేదిఁకఁ దత్ప్రయో
జనములుఁ దత్ఫలమ్ము లొకశాశ్వతమందునె? లేదుగాని, నా
మనమిటులన్ స్థిరంబగుటమాత్రము గానఁగ రాదికెట్టులన్
గనుఁగొన, నస్థిరుల్ సుఖముగాంతురె యెందును? జా॥

చ॥ కనుఁగొనఁ జక్రనేమి వలెఁ గాలము తానతి శీఘ్రగామియై
చనుటరయంగఁ జాలక పిశిసంస్థులమానసు లొంచుఁ బుణ్యపుం
బనులనొనర్చుపట్లనిదె పొణ్ణిమిషుల్లదె దస్యమంచ హా!
దినములఁ దీర్చిరే సుగతి తెన్ను లభించునె? జా॥ [కై

ఉ॥ మంచియుఁ జెడ్డయుం దెలియు మానవులౌదురె? చిన్నమెల్లఁ
పొంచిచరించుపిల్లివలెఁ బోయినపోటుల కెల్లవచ్చి ప్రా
పించెను మృత్యువంచు జనులించుకయుంగఁగ లేరు నిన్ను ధ్యా

§ కవిసంస్థుల=నిలుకడలేని.

ణించుటకంటెవారికిల నెక్కుడుగల్గునె? జానకీప్రియా॥

ఉ॥ ఎంచఁగనీప్రపంచమునకించుక తక్కువగాకనీవ వ్యా
పించితివంచుఁదెల్పునల పెద్దలసుద్దులనాలకించియున్
మించినినున్గనుంగొనము, మేదినినంధులుస్వాగ్రదేశమం
దుంచినవస్తువుం దెలియ నోపనిమాటికి జానకీ॥

చ॥ కరములుపూజసేయనినుఁగాంచఁగఁగన్నులునీకుమ్రొక్కఁగా
శిరముత్వదీయగేహములచెంతకునేగఁగ నంఘ్రియుగ్మమున్
గరమొనరింపఁగాఁబనుట గాంచకతద్విపరీతకార్య త
త్పరములుగానొనర్చెదము తత్కరణంబుల జా॥

ఉ॥ చెప్పఁగలేముత్వచ్చరితచిత్రములన్ భువిబర్హిపింఛమున్
ద్రిప్పుచులేనిదున్నటుల నేర్పుననున్నది లేనిరీతిగాఁ
గప్పుమునింద్రజాలకుని కైవడిలోకుల నీదుమాయచే
ముప్పులఁబెట్టుచుందువఁట మోదమె? నీకిది జా॥

ఉ॥ నీకలవాటుగల్గుపని నీవొనరింపుము మున్ను *ధేనుకా
నీకములోమసంగున †ననేకపమొక్కటి చిక్కసక్రి బా
ధాకులమైనఁబ్రోవవె? భవాంబుధిఁజొచ్చికలంగుమాకుఁజీ
కాకిడు కామలోభముల గండడఁగింపుము జా॥

చ॥ ఎఱుఁగక కొంతెఱింగి యొనరించినపాపశిలన్ భవత్కృపా
వరతరరేణుమాత్రమున ¶వామగఁజేయుమటంచు నింక దు
ర్భరవిషయాదిసక్తియను రక్కసిపెక్కువయుక్కడంపఁగాఁ
బరిపరివేఁడుచుంటి సులభంబిది నీకని జా॥

---

* ధేనుకానీకము=ఆడేనుఁగులగుంపు; † అనేకపము=గజేంద్రుఁడు;
¶ వామ=వక్రము=ఆఁడుది.

ఉ॥ పాయమువచ్చుటే మొదలు భక్తినినమ్మినవానిఁగాఁ *గృపా
కాయుఁడవైననీవుననుఁ గాంచిన నాకిఁక నేమిలోపమా
వాయసముంజయింపఁ దృణవల్లియె యస్త్రము, రావణాదిదై
తేయమహాస్త్రముల్ తృణముతీరునఁ జేయవె? జా॥

ఉ॥ నీదగురూపముం దెలియ నేననెంతటివాఁడ మానులే
లేదనియున్నదంచు నొకలేశమునైన నెఱుంగ కే వివా
దోదధిమున్గియున్గి కరుణోన్నతచిత్తుఁడవైన నీకృపం
గాదె! తరింతుమందు రవికార,నిరంజన జా॥

ఉ॥ కన్నియనొక్కతెన్మఁడకుఁ గట్టుకొనందగునట్టి యత్నముం
బన్నిగ్రహించిదానిపరిపాలనకై యవిపాపకార్యముల్
పున్నెపుఁగార్యమిద్దియని పొల్పెకపెద్దలు తెల్పినట్టియా
తిన్ననితోవకున్వలిగఁ దిగ్గదరయ్యయొ! జా॥

చ॥ ఇరువదినాల్గుతత్త్వముల కెక్కుడుతత్త్వమ నైపరంబరా
త్పరుఁడవునై సుఖాదికద్వంద్వఫలంబులవీడుచు స్వరం
తరజగదేకరూపివయి తద్దయుభాసిలునిన్ను మూఢులౌ
నరులొకరాజమాత్రుఁ డనినందగునా? యది, జా॥

ఉ॥ అక్కట! ఎక్కుడౌధనములన్నియుఁ గల్గినవాఁడుపూటకూ
మొక్కటకైనలేని †నిస్వుఁడు నొక్కటిగా భవాబ్ధిలోఁ
జిక్కితపించుచుండె యెఱిఁగి చేష్పడియుండ్ ధనికత్వమందఁగాఁ
జిక్కులనందుచుం బరవశీకృతులౌదురు జా॥

ఉ॥ పెక్కగునామయంబులకుఁ బేటికయౌ §మెయిపైనిబూనిక

* కృపాకాయుఁడు=దయాస్వరూపుఁడు, † నిస్వుఁడు=దరిద్రుఁడు,
§ మెయి=శరీరము.

మఱున్నఁజూపిదానివలనన్ లభియించెనుదుఃఖజాలమే
నిక్కపుసౌఖ్యమంచలరి నెమ్మది జేరిటిలేడిమాయ,యన్
*తెక్కలివోయి †యగ్గమయి నెవ్వఁగఁగూరెదు జా॥

చ॥ ¶తనకుఁగలట్టియాయువు వృథాయగునట్టుగ §పర్వతోగ్రమా
ననుచు శిరోధియందు ‡నవదాన్త్యయటంచుఁబఠించుచున్
ధరన్। ఘనుఁడనటంచు దిర్గుట యొగానిసమస్తజగంబులీవటం
చునెఱుఁగఁజేయుమార్గమును జూడఁడొకొక్కఁడు? జా॥

చ॥ మఱియొకమాటదెల్పెద నమాయికవృత్తిగ నీవు తప్పబల్
దురితతరుప్రకాండములఁ ద్రుంచెదు వేలుపులేఁడటంచు సు
స్థిరముగఁగాన, నీవునుమదిం దయచేఁగనిమమ్ముఁబ్రోచినన్
మఱిమఱికీర్తి నొందెదసుమా కరుణాకర జా॥

చ॥ తపములువేయి చేసినను దానములుంబదివేలుచేసినన్
జపములనేకలక్షలును జల్పిననన్నిటికిం ద్వదీయ స
త్కృపయె ప్రధానమంచు మదినెంచినమేలగు లేక యున్నదం
భపటిమగాని పుణ్యఫలపాకములేదిల జా॥

ఉ॥ ధీరులునాదుమాటలకుఁ దిట్టినఁదిట్టఁగనిమ్ము గాని యీ
తీరుననేవచించెదఁద్వదీయ పదంబులఁగొల్వకే సదా
చారములెన్ని చేసినను స్వర్గముఁబూడిదలోనుపోయు ప
న్నీరమెగాని చెందనగునే? యొః పుణ్యము జా॥

ఉ॥ దోసమునాకపెద్దలిడు త్రోవఁద్యజించిధనమ్ముపోకగాఁ
జేసినమేలుగల్గునని చిత్తములం దలపోయుచున్ దుర

---

* తెక్కలి=మోసగాఁడు, † అగ్గము=అధీనము, ¶ ఈపద్యమున §గుఱుతుగలది తర్కములోనివాక్యము. ‡ గుఱుతులుగలవి వ్యాకరణసూత్రములు.

భ్యాసములంజరించుచు మహాఘములందమచేతులారఁగాఁ
జేసిఫలమ్ములందినఁ జెల్లునె ? యేరికి జానకీప్రియా॥

ఉ॥ మానుగనీపదాబ్జముల మానకకొల్చుటెమేలటంచు నేఁ
బూనికయత్నమెంతయునుబూర్ణముగానొనరించుచుండియున్
మానసమున్హయంబును గ్రమంబుగఁద్రిప్పఁగనేర
కుంటిఁగ। ర్మానుగుణంబెబుద్ధియని యార్యులుదెల్పరె? జా॥

ఉ॥ సంతతమున్భవన్నుతులఁ జల్పుటకేమది నెంతుఁగాని యా
వంతయొకప్డువిస్మరణమందుచు నుంటినటంచునాపయిం
బంతమువూనఁగావలదు బాలిశుఁడన్గద ! లోకమందు ధీ
మంతులకైన:గల్గదుఁ బ్రమాదమొకప్పుడు జా॥

ఉ॥ క్రోతులమాడ్కి నెక్కపుడు*కొమ్మలపైఁజరియించుచుండున
త్యాతతసక్తిఁగాఁగిట సుతాదులఁగూర్చునొకప్డుసద్గృహ
వ్రాతములంజరింపఁదగు వాంఛగనున్గద ! మామనంబు లే
రితి,ఁద్వదీయపావనచరిత్రల నెన్నుట? జా॥

ఉ॥ అన్నిటనిండిపూర్ణుఁడవునై మునిమానసగోచరుండవై
యున్ననునిన్నుఁగన్గొనఁగ నొప్పెడుజ్ఞానసులోచనంబులే
కున్నఁగన,న్వశంబగునె? యోశ్రితరక్షక! యింతయేల? నా
కన్నులకున్మదంబొదవఁ గాఁ,గనుపట్టుము జా॥

చ॥ మతియొకవిన్నపంబువినుమా! బ్రతిమాలెదవారివారి మం
దిరములచెంతఁజేరిభవదీయుఁడ మిమ్ములఁగాంచవచ్చితి
‡హరిహయులంతవారుతమరన్ జెడునన్నుతులాచరించుతె
న్నరయఁగనీకుమెప్డు పరిహాసముకైనను జా॥

---

* కొమ్మలు=స్త్రీలు, చెట్లు, ‡ హరిహయులు=ఇంద్రులు=

చ॥ సుకృతముదుష్కృతమ్మనుచొప్పనృతమ్మని, తత్ఫలమ్ము వే
ఱొకపుడు పొందుచుంటయు నున్నొప్పుగ లేదిహ మొండె గాక వే
ఱొకటియునున్న దే? యను *దురుక్తికుఁడీవు సమానబుద్ధితో
సకలముఁ బ్రోవ లోకుల †దశాభిద కేమను? జానకీప్రియా॥

చ॥ పరమభవత్పదాబ్జయుగ భక్తిలతన్ సుజనాళిచేఁ బరం
పరగ లభింపఁ దెచ్చి మదిపాదుగ నాటితి దానికిన్ భవ
త్కరుణను నూతఁ గొంనిడి కాచినఁగాని ఫలించు లేనిచోఁ
‡చరమదశన్ వహించు ననుచందమెఱుంగవె? జా॥

చ॥ రజముతమమ్ము నుత్కటతరంబగుచుండుట సదా భవత్పదాం
బుజములఁ గొల్వఁజాల, నొకపూటయు నన్మది సత్త్వమంద నీ
భజనమొనర్పఁ బూనుదును బంతమునన్ నెదదార్ఢ్యమారయ
న్గఁబిజి యమాంశ నే? కంపనమొందమి జానకీప్రియా॥

ఉ॥ పోఁడిమి మీఱ అభక్తజన పోషణచేసెదె వారిలోన నీ
కీడగు వారలీధరణి నెందును లేరని నమ్మి, నన్ గృపం
జూడుమనంగఁ గాంచెదవు సొమ్మిడినట్టులఁ జూడపట్టి వే
లాడినఁ బైకిఁ ద్రోచెదవహా! యిదియుక్తమె? జా॥

చ॥ వెతలకుఁ దావు నాఁగనొకవీసము సారములేని మేని సం
గతికమునశ్వరంబనుచుఁ గాంచక గట్టివి మోహరజ్జువుం
గుతుకముఁ గట్టికొంటి నినుఁ గొల్వఁగ నెట్లు దెల్వడి బ్రోవుమయ్య! య
ప్రతిమభవత్పదాబ్జయుగ భక్తి సిగూర్చుచు జా॥

---

* దురుక్తికుఁడు=పతిండవాడు, † దశాభిద=అవస్థాభేదము,
‡ చరమదశ=నాశము.

ఉ॥ శైలచయమ్ముపాలి కులిశమ్మనఁ గాఁదగి తూలసంఘ వా
*తూలముపోల్కిఁ బాపములఁ ద్రోయఁగఁ జాలెడు నీదు నామమే
కాలమునాఁడు నాలుకను గల్గెడు భారము నీదె సుమ్ము ఈ
†బాలిశుఁ బ్రోచు టేమనెడి పద్ధతి మానుము జా॥

చ॥ ఇలను శరీరముం గొనుట నెంచెదమున్ §నృజన్మమందు నిన్
దలఁపక యుంట, గాననిది తప్పుగదా! నృత్వము భక్తి నిన్
దెలియుట ముందు వాటిలు న దేహత గావున నింక భక్తి నిన్
గొలువని తప్పు రెండిటికిఁ గోపముఁ బూనకు జానకీప్రియా॥

ఉ॥ నిక్కముగా వచింతు ధరణిన్ నినదిక్కుగ నమ్మియున్న నా
జిక్కులఁ బెట్టెదేనిఁ గడుఁ జెందెద వీవపకీర్తి మున్ను ని
న్నక్కున భక్తిఁ దోఁగలిచియే, వెతలొందెను రామదాసుఁడీ
ఫక్కిఁ దలఁపుమాని గొను భవ్యయశంబిఁక జా॥

ఉ॥ రామఁ బవిత్రనామునిఁ బరాకున నైన నను భీతి నైనఁ దా
భామిని పేరిచేనయినఁ బల్కెడువారల పాపజాలమొం
తే మొడఁబట్టి గెంటునటు లించుక చేరవటంచుఁ బండిత
స్తోమము దెల్పునాకునటు దోఁచెడి నారయ జా॥

ఉ॥ ఈ వెసురావలిన్ గరుణ నెంతయుఁ బ్రోవఁగఁ దండ్రియాజ్ఞయే
త్రోవఁగఁ జూపుచున్నదము తో, నిజసీతను డాచి §నృత్వమొం
తే వివరింపమాయపడఁ దిన్గనఁ గాఁడవింజరించి తా
వవిధినైన నీచరిత లించుకెఱుంగమె ? జా॥

---

* వాతూలము=గాలి, † బాలిశ=మూఖుఁడు,
§ నృత్వ=మనుష్యరూపము.

ఉ॥ లోకములెల్లనీకఁగడులోఁకువగా జరియింపనీవటుల్
కైకయిపుఁవునన్నిగుల గహ్వరమా వనసీమ కేగితే ?
శ్రీకర ! నీకృపామహిమ చెల్వుగనన్ భవదంఘ్రినీరజా
లోకనఁగోరువారిఁ గనలోలతఁగాకటు జానకీప్రియా॥

ఉ॥ నాదయవచ్చునప్పుడవనం బొనరించెదనంట లోకమ
ర్యాదయె? దాసవర్గహృదయమ్ములఁ గాంచియె ప్రోవఁగావ
లెన్। గాదనుమాటకీర్తికొక కారణమా ? కనుమీనె, నేని
టుల్। వాదముచేసితంచు నను వంతలబెట్టక జా॥

ఉ॥ *వేదశిఖల్వచించుట వివేకులుదెల్పుదురీవె హేతువీ
మేదిని పైఁగనంబడు నమేయచరాచర వస్తుజాతికిన్
మేదినిఁగల్గుకార్యములునీవని, కావుననీకువేఱుగా
లేదొకయింతయంచు నవలీలఁగజూచెద జా॥

ఉ॥ మాన్యములిమ్మటంచు నినుమాటికిఁబ్రార్థన చేయలేద సా
మాన్యధనంబొసంగఁ బలుమాఱులుగోరఁగలేదుగాని, ని
న్నన్యులొసంగఁజాలని మహాసుఖదంబగునీదుమాని స
మ్మాన్యపదాంబుజాతయుగ భక్తినిగోరితి జ॥

చ॥ †తవచరణాంబుజేకురు సదామమమానస సద్మసీతి మా
మవకరుణార్ద్రదృశేతిచ కియానహమాది విరాజమీశ్వరం
భవముఖదేవతా అపివిభావయితుం ఖలుసాశకంశ్వతాం
భవహరయంచు వేడెదఁ గృపంబరికింపుము జా॥

---

* వేదశిఖల్ = ఉపనిషత్తులు,

† ఈపద్యమున 'భవహరయంచు' అనునంతవఱకు సంస్కృతము.

చ॥ రయమున సోమకుండనెడి రక్కసుఁ డొక్కరుఁ డుక్కుమీఱి తాఁ
త్రయిఁగొని సంద్రముం జొరఁగ ధర్మముఖాఖిలపూరుషార్థ
ముల్ లయమగునంచు వేల్పులు గలంగి, నినుం గడు వేడ వార
లన్ దయఁగని మత్స్యరూపమున దానవుఁ ద్రుంపవె? జా॥

చ॥ ఖడలిక కోర్కిఁ దామమృతపానము సేసెదు వేడ్కలిఱాఁ బా
ల్కడలి మథించు వేళఁ దరిగట్టు మునుంగఁగ నాపలేక ని
యముగులత్రావాలు వేలుపుల నాశయలంగని కూర్మరూపమున్
పడిఁగొని వారి నెల్లర *ఘృణం దగఁ బ్రోవవె ? జా॥

చ॥ మునుగడు క్రూరుఁడై భువనముల్వడఁకన్ ధరణీతలంబు నె
ల్లనొక కటంబు చాడ్పున బలంబునఁ జుట్టుచు హేమనేత్రుఁడు
దక్కనమి కులంగ లోకములు గోలని యార్వ వరాహమూర్తివై
పనుపవె? వానినాశమున పత్త్రనసీమకు జా॥

ఉ॥ ఆరయ నీదు దాసునకు నార్తి ఘటించిన సైఁపకే క్రుధా
పూరముమై హిరణ్యకశిపున్ నరసింహమవై భయంకరా
కారము మీఱఁ గంబమున, గల్పుచు వచ్చి నఖాసిధారచేఁ
జీరి తదాత్మజుం గరుణ చేఁగని ప్రోవవె? జా॥

చ॥ వడుగుతనాన నీవ యలవామనసంజ్ఞ వహించి కేలను
న్గొడుగు నొకండు గొంచు ధృతిఁ గోవిదుఁడై బలిచెంతకేగి మూ
డడుగుల దేశమిమ్మనుచు నాకసముం దెసలాక్రమించి మూ
డడుగుల నాబలిం బుడమి సంటఁగఁ ద్రొక్కవె? జా॥

ఉ॥ ఒక్కనృపుండు నీ జనకునొద్ద నొనర్చిన తప్పు నెంచి యే
†యిక్కువ డాగియున్న నుద్యజింపక ఇర్వదియొక్కమారులున్

---

* ఘృణ=దయ, † ఇక్కువ=స్థానము.

గ్రక్కున నల్లరాజుల కకాలపుమృత్యువు జామదగ్న్యమే
నిక్కమనన్వధించితివి నీవగదా! యటుజా॥

ఉ॥ రావణతత్సుతాద్యఖిల రాక్షసబాధల కోర్వలేక శ్రీ
దేవినిగూడి యున్న నిను దేవతలెల్లను జేరినమ్రులై
ప్రోవుమటంచు వేడ రఘుపుంగవ! సూర్యకులంబునందు స
ద్భావమునొంది తీవగద! భక్తజనావన! జా॥

చ॥ హలముకేలఁబూని యసితాంశుకముంగటిఁ జుట్టిశారదా
భ్రలలితకాంతి మీఁదనువు భాసిలయాదవ వంశవార్ధికిన్
సలలితపూర్ణచంద్రుఁడను చాడ్పున శ్రీబలరామమూర్తినా
నిలనిజభక్తజాలముల కీవెశుభంబులు జా॥

ఉ॥ ఇద్ధరనీవెదిక్కని త్వదేకమనస్కతనున్న వారికాత్మో
ద్ధరణమ్ముచేయుచు మహోద్ధతవృత్తిఁజరించునట్టి దు
ర్బుద్ధిపరాయణాగ్రణుల పోఁడిమిదూల్పఁగ బుద్ధరూపివై
శుద్ధచరిత్ర! లోకములఁ జూడవె? సత్కృప జా॥

చ॥ దురితపుఁబోక, దుష్టజనతోయధి, దుర్గుణరాశి కాకరం
బురుతరదుర్ణయాధిపున కొప్పిన నచ్చెలి యైన యిక్కలిన్
ధరనఖిలంబుఁబ్రోచుటకుఁ దాల్పవె? కల్కితనంబు దేవ! నీ
చరితము లెన్న నేరికిని శక్యమె? రాఘవ! జా॥

ఉ॥ సాంతముగానెఱుంగుభవదంఘ్రిమహాత్త్వమహల్య, పార్వతీ
కాంతుఁడెఱుంగు నీచరితఁగల్గుయథాస్థితి, వానిచాపమా
వంతయెఱుంగు నీప్రబల బాహుపరాక్రమమంతెగాని గో
రంతయు మాదృశుల్దెలియ నర్హులెగాంతురె? జా॥

చ॥ భవలోకకంటకుఁడైన నినుభావనచేసి సుఖింతునన్న నీ
భవమునఁగల్గు కార్యముల పారములాపములాత్రులందుఁగ
న్గవనటుమాయ నిద్దురఘనంబయి నిన్మఱపించు నన్నహా!
భవదమలాంఘ్రిభక్తి యెటువాటిలు నాకిఁక జా॥

చ॥ పతులకొనర్చు కార్యములపట్ల రుచింగనుపింపఁజేయుచున్
సతతము నన్యకాంతు దృఢసంగతి నెంతయుఁగోరి కోరితు
ట్టతుదకు వారిఁజేరు కులటల్ వలెమానసముల్ భవంబునం
గలిఁగొనియుం, త్వదంఘ్రిరతిఁగాంచఁగఁ జేయుము జా॥

ఉ॥ తుంగభుజాబలప్రబల దుష్టనిశాచర తోలనోద్ధితా
భంగురదివ్యకీర్తికర భవ్యచరిత్ర తరుప్రశాఖికా
సంగలసద్గుణప్రసవసారలగద్వర భక్తజాల హృ
ద్భృంగ! యొసంగు, మంగళధురీణత, మాకొగి జా॥

చ॥ నరులవివేకులై తమరొనర్చిన పాపములెల్లఁదూల్పఁగాఁ
బరివరినీచరిత్రలను బాడినచోనవి యెల్లఁద్వత్కృపా
ఝురిఁబడి తామెయుంగ యొసల్పిన పావములేటఁబోవునన్
ధరఁగల సూక్తిరీతిగ యథాయథలై చెను జా॥

చ॥ పలుమాఱువేడి నీదయకుఁ బాత్రుఁడనై నను బూర్వకర్మని
ర్మలఫలముల్ భుజించుటలు చావకతీరని గూనివంపుగాఁ
దలకొనినన్, రఘుప్రవర! తావకపాద సరోజసేవనా
ఫలముల నొందనర మఱు ప్రాభవమెక్కడ? జా॥

ఉ॥ వేవములెన్నియేని నవివేకము నేఁగొని పాపజాలముల్
జేసియుఁ జేసినట్లయిటుఁగఁ జేసి నినుంభజియించు వానియా

చ॥ ఇలగలనీదుభక్తులు నిజేప్సితముల్గొన నిన్నుభక్తిమైఁ
దలఁచుచు రత్నహారములఁ దారుసమర్పణ మాచరింతురే
నలఘుధనాప్తిలేమిని సమర్పణచేసితిఁబద్యచంపకో
త్పలఘటితమ్మునే స్రజము తప్పర తంగొను జా॥

చ॥ అల చినవేంకటార్యాయబుధాగ్రణిపుత్రుఁడు రామజోగిశా
స్త్రులకును చెల్లమాంబకునుసూనులు నల్యూరిలోఁగనిష్ఠుఁడీ
య్యలనవుడూరి వేంకటసుధీంద్రునిశిష్యుఁడు వేంకటాఖ్యుఁడ
త్యలఘు భవత్పదాశ్రితుఁడు నౌనను బ్రోవుము జా॥

ఉ॥ పండితులెల్లదీనిని గృపంబరికించి పఠించుచొక్కచో
నుండినఁదప్పులన్విడిచి యొప్పుగ్రహింపఁగ వేంకటాఖ్యుఁడా
ఖండిసదన్వయుండు మదిఁగోరెడుదీనికిఁ గూర్పుమిందుమా
ర్తాంశులునుండునంతకు స్థిరత్వము సత్కృప జా॥

చ॥ దయకడుమీఱ, ధారణిసుతాహృదయాంబుజచోర! భక్తమ
ద్భయదురితాపహార! బుధరక్షణకార! త్వదీయజానకీ
ప్రియశతకమ్ము నెంతయును బేర్మిఁబఠించిన వారికీవుని
ర్భయసుఖసంపదోచ్ఛ్రయముఁ బాటిలఁజేయుము జా॥

శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల, విజయనగరం.

